

# అలీబాబా

ఇరానులోని ఒక నగరంలో ఇద్దరన్న దమ్ములుండేవారు. ఒకడి పేరు కాసిమ్. రెండోవాడి పేరు అలీబాబా. వారికి తండ్రి కొద్దిపాటి ఆస్తిని సమంగా పంచిపోయాడు. కాసిమ్ ధనవంతుల పిల్లను పెళ్ళాడి, వర్తకం చేసి తానుకూడా ధనికుడయాడు. అలీబాబా పేద ఇంటిపిల్లను పెళ్ళాడి, కట్టె లమ్ముకుని జీవించసాగాడు. అతను రోజూ అడివికి వెళ్ళి, కట్టెలు కొట్టి, వాటిని తన మూడు గాడిదలపైనా వేసి పట్టణానికి పోయి, అక్కడ అమ్మేవాడు.

ఒకనాడు అలీబాబా అడవిలో కట్టెలు కొట్టేసమయంలో అతనికి దూరాన దుమ్ము రేగటం కనిపించింది. ఆ దుమ్ము అంత కంతకూ దగ్గిరకి రాసాగింది. అతను మరి కొంచెం పరిశీలనగా చూసి, కొంతమంది మనుషులు గుర్రాలెక్కి వస్తున్నట్టు గ్రహించాడు. వారు దొంగలై వుండవచ్చునని అతనికి తోచింది. తన గాడిదలు ఏమైనప్పటికీ, తన ప్రాణం దక్కించుకుందామను కుని, ఎత్తుగా గుట్టమీద వున్న పెద్ద చెట్టెక్కి, దట్టంగా ఆకులుగల కొమ్మలమధ్య దాగి, తాను ఎవరికీ కనబడకుండా, కింద నడిచే దంతా గమనించసాగాడు.

త్వరలోనే ఆశ్వికులు అదే గుట్టను చేరుకుని గుర్రాలు దిగారు. వారు నలభైమంది వున్నారు. వారందరూ తమ గుర్రాలను కట్టేసి, వాటి మూతులకు దాణాసంచులు తగిలించి, జీనులనుంచి బరువైన సంచులు విప్పి చేతపట్టుకున్నారు. ఆ సంచులలో వెండి బంగారాలవంటి బరువైన సరుకు లున్నట్టు అలీబాబాకు తోచింది.

ఆ నలభైమందిలోనూ ఒకడు నాయకుడులాగా కనిపించాడు. వాడు పొదల మధ్యగా నడిచి గుట్టను సమీపించి, "తలుపు తెరు, నువ్వులూ!" అన్నాడు. వాడామాట అన

ఆర్. సూర్యనారాయణ





గానే రాతిలో ఒక తలుపులాటిది తెరుచుకున్నది. మిగిలినవాళ్ళందరూ ఆ ద్వారంలోనుంచి లోపలికి వెళ్ళాక దొంగల నాయకుడు తానుకూడా వెళ్ళాడు. తరవాత రాయి ఎప్పటిలాగా మూసుకున్నది.

అలీబాబాకు చాలా భయంవేసింది. అతను చెట్టుమీదనుంచి దిగనేలేదు. కొంతసేపు గడిచాక రాతితలుపు మళ్ళీ తెరుచుకుని దొంగలనాయకుడు బయటికి వచ్చాడు. మిగిలినవారి నందరినీ బయటికి రానిచ్చి, "తలుపు ముయ్యి, నువ్వులా!" అన్నాడు. వెంటనే రాయి మూసుకున్నది. అందరూ తమతమ గుర్రాలను విప్పి, వాటిమీద ఎక్కారు. నాయకుడు ముందు కదిలాడు, అతనివెనక మిగిలిన ముప్పైతొమ్మిదిమంది దొంగలూ కదిలారు.

ఇదంతా అలీబాబా చెట్టుపైనుంచి చూశాడు. దొంగలు కనుచూపుమేర దాటిపోయిన చాలాసేపటివరకూ అతను చెట్టుపైనే వుండి ఆ తరవాత దిగాడు. దొంగల నాయకుడు అన్న మాటలే అంటే తనకు కూడా ద్వారం తెరుచుకుంటుందేమో చూడాలని అతనికి కుతూహలం కలిగింది. అందుచేత అతనుకూడా పొదల మధ్యగా వెళ్ళి రాతితలుపు వుండేచోట నిలబడి, "తలుపు తెయ్యి, నువ్వులా!" అన్నాడు. వెంటనే గభీమని తలుపు తెరుచుకున్నది.

లోపల గుహలాగా చీకటిగా వుంటుందని అలీబాబా అనుకున్నాడు, కాని అతనికి ఒక కాంతివంతమైన, విశాలమైన గది కనిపించింది. పైనుంచి గదిలోకి వెలుతురు వస్తున్నది. గదినిండా రకరకాల వస్తువులూ, పట్టుతానుల బేళ్ళూ, జరీబట్టలూ, ఎత్తుగా పేర్చిన రత్నకంబళాలూ, వెండి బంగారు కణికల పోగులూ, ధనపు సంచులూ వున్నాయి. ఇదంతా చూసి, ఎన్నితరాలుగానో దొంగలు ఇక్కడ వుంటూ వుండివుండాలని అలీబాబా తెలుసుకున్నాడు.







అతను ధైర్యంచేసి లోపలికి వెళ్ళి తన మూడు గాడిదలూ మోయగలిగినంత బంగారం సంచులు తీసుకున్నాడు. వాటిని గాడిదలమీదకెత్తి, అవి చూసేవారి కంట పడకుండా వాటిపైన కట్టెలు పేర్చాడు. చివరకతను బయటికి వచ్చి, "తలుపు ముయ్యి, నువ్వులా!" అన్నాడు. వెంటనే తలుపు మూసుకున్నది.

అలీబాబా తన గాడిదలను తోలుకుని నేరుగా ఇంటికి వెళ్ళాడు. గాడిదలను దొడ్లోకి తోలి, తలవాకిలి తలుపు గడియపెట్టి, కట్టెలు తీసేసి సంచులను ఇంట్లోకి తీసుకుపోయి, వాటిని భార్యఎదుట బారుగా పెట్టాడు. అతను ఆ సంచులలోని బంగారాన్ని కుమ్మరించేసరికి అతనిభార్య కళ్లుచెదరిపోయాయి. అతను ఆమెతో జరిగినదంతా చెప్పి, ఈ విషయం పురుగుకైనా తెలియనీయవద్దని హెచ్చరించాడు. అతనిభార్య ఆనందానికి మేరలేదు. భర్త తెచ్చిన బంగారునాణాలన్నీ లెక్కపెడతానని ఆమె అన్నది. "ఓసీ, వీటిని లెక్కించటానికి నీ ఆయువు చాలదు. మనకా వ్యవధిలేదు. వీటిని భద్రంగా ఎక్కడైనా పాతిపెట్టాలి," అన్నాడు.

"నువు చెప్పినది నిజమే. కాని కాస్త అటూ ఇటూగా ఎంత బంగారం ఉన్నదో తెలియాలి. కనీసం దీన్ని కొలత వేద్దాం. నువు గుంటతవ్వేలోగా నేను ఒక సోల తెస్తాను," అన్నది భార్య. ఆమె తన బావగారైన కాసిమ్ ఇంటికి వెళ్లి తన తోడికోడలితో, "ఒక సోల వుంటే ఇస్తావా? ఇప్పుడే తెచ్చిఇస్తాను," అన్నది.

కాసిమ్ భార్య సరేనన్నది. తన మరిది ఇంట్లో ఏం ధాన్యం వండుకుంటున్నారో తెలుసుకునే వుద్దేశంతో ఆమె సోలలోపల అడుగున గోదు అంటించి సోల తెచ్చి తన తోడికోడలి కిచ్చింది. అలీబాబా భార్య ఇంటికి వచ్చి తన భర్త తెచ్చిన బంగారం ఎన్నిసోలలున్నది లెక్కచూసి, తరవాత





తన భర్తవద్దకు వెళ్ళి, "గుంట తవ్వటం అయిందా ?" అన్నది.

అలీబాబా గుంట తవ్వటం ముగించాడు. భార్యాభర్తలిద్దరూ కలిసి బంగారాన్ని ఆ గుంటలో పెట్టి పూడ్చారు.

తరవాత అలీబాబా భార్య అన్నమాట ప్రకారం సోలను తీసుకుపోయి తన తోడికోడలికిచ్చేసింది. ఆ సోల అడుగున ఒక బంగారునాణెం అంటుకున్న సంగతి ఆమె గమనించనేలేదు. "పనికాగానే నీ సోల తెచ్చి నీకిచ్చానమ్మోయ్!" అని హెచ్చరించి ఆమె తన తోడికోడలువద్ద సెలవుతీసుకుని ఇంటికి వెళ్ళిపోయింది.

కాసిమ్ భార్య సోలలోపల చూసేసరికి బంగారునాణెం కనిపించింది. ఆమె ఒక్క క్షణంపాటు దిమ్మరపోయి, "ఏమిటీ ? అలీబాబా బంగారాన్ని సోలలతో కొలిచేటంత భాగ్యవంతుడైనాడుగా ? ఇంత సిరి ఇంత అకస్మాత్తుగా ఎట్లా ఎత్తుకున్నదబ్బా!" అనుకున్నదావిడ, అసూయతో నిలువునా దహించుకుపోతూ.

ఇదంతా జరిగే సమయానికి కాసిమ్ తన దుకాణంనుంచి ఇంకా తిరిగి రాలేదు. కాని ఆయన రాగానే ఆయన భార్య, "నువు చాలా ధనికుణ్ణని అనుకుంటున్నావు గామాలు! నీ తమ్ముడు అలీబాబా నీకన్న



వెయ్యిరెట్లు ధనికుడు! ఆసంగతి తెలుసుకో. అతనిదగ్గిర ఎంత బంగారం వున్నదంటే దాన్ని లెక్కపెట్టటానికి సాధ్యంకాక, సోలలతో కొలిచి చూసుకుంటున్నాడు, ఏమనుకున్నావో!" అన్నది.

"ఏమిటి నువ్వనేది? నాకేమీ అర్థం కావటంలేదు," అన్నాడు కాసిం. అప్పు డాయన భార్య జరిగినదంతా చెప్పి, తాను అరువిచ్చిన సోలఅడుగున అంటుకున్న బంగారునాణెంతీసి చూపింది. అది అతి ప్రాచీనమైన నాణెం. ఏరాజు కాలంలో ముద్ర వేసినదో కూడా కాసిం ఎంత పరీక్షించినా తెలుసుకోలేకపోయాడు.

కాసిం డబ్బుగల వితంతువును పెళ్ళాడిన నాటినుంచీ తన తమ్ముణ్ణి పరాయి వాడల్లేనే చూస్తూవచ్చాడు. ఇంత కాలానికి అలీబాబా ధనం సంపాదించుకుంటే కాసిం సంతోషించటానికి బదులుగా అసూయతో కుంగిపోయాడు. ఆ రాత్రల్లా ఆయనకు నిద్రపట్టలేదు. మర్నాడు తెల్లవారుతూనే ఆయన అలీబాబా ఇంటికి వెళ్ళి, "అలీబాబా, నీ ధోరణి నాకేమీ నచ్చలేదు. నువు ఒకవంక అతి పేదవాడిలాగా బతుకుతూ చాటుగా బంగారం కొలుస్తున్నావుట. నిన్న నీ భార్యకు నా భార్య అరువిచ్చిన సోలఅడుగున ఈ బంగారునాణెం అంటుకున్నది," అన్నాడు.





ఈ మాటలు వినగానే అలీబాబా కుంగిపోయాడు. తాను ఏదైతే పరమరహస్యంగా ఉంచుదామనుకున్నాడో అది కాస్తా తన భార్య చేసిన పొరపాటువల్ల తన అన్నకూ, వదినెకూ తెలిసిపోయింది! అయితే అలీబాబా పైకి ఆశ్చర్యంగాని, భయంగాని కనబరచక, జరిగినదంతా చెప్పి, "ఈ విషయం రహస్యంగా ఉంచావంటె నేను తెచ్చిన బంగారంలో నీకూ్కడా భాగం ఇస్తాను!" అన్నాడు అన్నతో.

"భాగం ఎవడికోసం ఇస్తావు! నేనడిగేది అదికాదు. ఈ గుహ ఎక్కడుస్నదీ, అక్కడికి దారి ఏమిటో నాకు స్పష్టంగా తెలియాలి. అవసరమైనప్పుడల్లా నేనుకూడా వెళ్ళి అక్కణ్ణుంచి సొమ్ము తెచ్చుకుంటాను మరి!" అన్నాడు కాసిం.

గత్యంతరం లేక అలీబాబా అన్న కోరినదంతా చెప్పేశాడు; తలుపు తెరవటానికీ, మూయటానికి అనవలిసిన మాటలుకూడా ఆయనకు చెప్పాడు.

కాసిం మర్నాడుదయం తూర్పుతెల్లారక మునుపేలేచి, పది కంచరగాడిదలమీద పెద్ద పెద్ద కావడిపెట్టెలు వేసుకుని, అలీబాబా చెప్పిన మార్గాన అడివికి వెళ్లాడు. అలీబాబా ఎక్కిన చెట్టూ, పొదలూ, గుట్టా, అన్నీ ఆయన పోల్చుకుని రాతిద్వారం చేరుకున్నాడు. "తలుపు తెరు, నువ్వులా!" అనగానే ద్వారం తెరుచుకున్నది. కాసిం లోపలికి వెళ్ళగానే తలుపు మూసుకున్నది.

లోపల ఉండే ధనరాసులు చూసి కాసిం తన్మయుడైపోయాడు. అలీబాబా చెప్పిన మాటలనుబట్టి ఆయన ఇంత ధనం ఉంటుందనుకోలేదు. ఆయన మనసు పూర్తిగా డబ్బుమీదనే లగ్నమయింది. ఆయన తాను తీసుకుపోదలచిన సంచులన్నీ తెచ్చి వాకిలిదగ్గిర పేర్చిపెట్టాడు. అయితే ఈ ధనమంతా తన యింటికి చేర్చటంలో తన్మయత్వం చెందిన కాసిం







తలుపు తెరిచే మంత్రం కాస్తా మరిచిపోయి, "తలుపు తెరు, నువ్వులూ!" అనటానికి మారుగా, "తలుపు తెరు, మెంతులూ!" అన్నాడు. తలుపు తెరుచుకోలేదు. కాసిం దిగ్భ్రమచెందాడు. కంగారులో అతను మిరియాలనూ, ధనియాలనూ ఇంకేవేవో ధాన్యాలను జ్ఞాపకం తెచ్చుకున్నాడుగాని, వాటివల్ల కాస్తయినా ప్రయోజనం లేక పోయింది.

వ్యవహారం ఇలా విషమిస్తుందని కాసిం కలలోకూడా అనుకోలేదు. తాను ప్రమాదంలో చిక్కుకున్నట్టు ఆయనకు అర్థమయింది. తాను పేర్చిపెట్టిన సంచులను కాలితో తన్ని అటూ ఇటూ పచార్లు చేయసాగాడు. ఇప్పుడాయనకు ఆ గదిలో ఉన్న అంత గొప్ప సంపద ఏమాత్రమూ ఆకర్షవంతంగా కనపడలేదు.

మిట్టమధ్యాన్నంవేళ దొంగలు అక్కడికి వచ్చారు. దూరాన ఉండగానే వారికి గుట్ట వద్ద కాసిం తెచ్చిన కంచరగాడిదలు కనిపించాయి. వాటిమీద ఉన్న కావడిపెట్టెలనుకూడా దొంగలు చూశారు. ఇది చూడగానే వారికి కంగారు పుట్టింది. వారు తమ గుర్రాలను మరింత వేగంగా తోలి గుట్టను చేరుకున్నారు. వారు కంచరగాడిదలను అడివిలోకి తరిమేసి, కత్తులు దూసి, మంత్రం చదివి తలుపు తెరిచి, లోపలికి వెళ్లారు.

ఈలోపుగా కాసిం గుర్రాల డెక్కల చప్పుడు విని దొంగలు వచ్చినట్టు గ్రహించాడు. ఆయన బయటికి పారిపోవటానికి సిద్ధంగా ఉండి, తలుపు తెరుచుకోగానే పరిగెత్తుతూ వచ్చి దొంగల నాయకుణ్ణి ఒక్క తోపుతో కింద పడేశాడు. అయితే మిగిలిన దొంగలు ఆయనను పట్టుకుని కత్తులతో పొడిచి చంపేశారు.

తరవాత వారు తమ గుహ అంతా పరీక్షించుకున్నారు. కాసిం వాకిలిదగ్గిర పెట్టిన సంచులను వారు యథాస్థానంలో పెట్టేశారు.





అలీబాబా తీసుకుపోయిన బంగారం ఆచోకీ కూడా వారికి తెలిసింది. కాసిం లోపలికి ఎలా రాగలిగాడో, తమకు తెలిసిన మంత్రం పైవాళ్ళకు ఎలా తెలిసిందో వారు ఊహించలేకపోయారు. ఈ మంత్రం తెలిసినవారింకెవరైనా ఉంటే వాళ్ళని హడలగొట్టేటందుకుగాను దొంగలు కాసిం శరీరాన్ని నాలుగు ముక్కలుగా నరికి గుహలోపల ద్వారానికి రెండువైపులా రెండేసి ముక్కలు వేళ్లాడగట్టారు. తరవాత వారు మళ్లీ తలుపు యధాప్రకారం మూసి, తమ గుర్రాలెక్కి, దార్లు కాయటానికీ, బిడార్లను దోయటానికీ బయలుదేరి వెళ్లారు.

రాత్రి అయింది. కాసిం ఇంటికి తిరిగి రాలేదు. ఆయన భార్య ఆందోళనపడుతూ అలీబాబా ఇంటికి వెళ్లి, "మరిది, మీ అన్నయ్య అడివికి ఎందుకై వెళ్లారో నీకు తెలిసే వుంటుంది. చీకటి పడింది, ఇంత వరకూ ఆయన తిరిగి రాలేదు. ఆయనకు ఏమి ఆపద కలిగిందో అని నాకు భయంగా ఉన్నది!" అన్నది.

"ఇంతమాత్రానికే నువు భయపడ నవసరంలేదు, వదినా. ఊరు మాటుమణగక ముందు అన్నయ్య రాకపోవచ్చు," అన్నాడు అలీబాబా. కాసిం వెళ్ళిన పని చాలా రహస్యమైనది గనక అలీబాబా చెప్పిన మాటలు



కాసింభార్యకు సబబుగానే తోచాయి. ఆవిడ ఇంటికి తిరిగి వెళ్లి అర్ధరాత్రిదాకా ఓర్పుగా వేచివున్నది. కాని ఆ తరవాత ఆవిడ అనుమానాలు రెట్టింపు అయాయి. పైకి ఏడవటానికికూడా వీలులేకపోవటంచేత భర్తకోసం లోలోపల కుళ్లి ఏడవసాగింది. తన మరది వ్యవహారంలో జోక్యం కలిగించుకున్నందుకావిడ తనను తాను తిట్టుకున్నది. ఆవిడ తెల్లవార్లూ ఏడిచి, వాచిపోయిన కళ్లతో అలీబాబా ఇంటికి వెళ్లింది. ఆవిడను చూడగానే ఆవిడ రాకకు కారణమేమిటో అలీబాబాకు తెలిసిపోయింది. తన అన్నకు ఏదోప్రమాదం జరిగివుంటుందని అతడికి భయంకలిగింది.

ఆవిడ అడగకముందే అలీబాబా తన మూడు గాడిదలనూ సిద్ధం చేసుకుని అడివికి బయలుదేరాడు. వెళ్లేటప్పుడతను తన వదినెగారిని ధైర్యంగా ఉండమని చెప్పాడు. దారిలో అతనికి అన్న జాడగానీ ఆయన కంచరగాడిదల జాడగానీ తగలలేదు. దానికి తగ్గట్టుగా గుట్టవద్ద నెత్తురు మరకలు కనిపించాయి. అలీబాబా గుండె జల్లుమన్నది. అయితే అతను మంత్రం చదివి లోపలికి అడుగుపెట్టి తన అన్న శవంతాలూకు ముక్కలు చూసేసరికి నిలువునా నీరైపోయాడు. తన అన్న తనపట్ల సోదరప్రేమ చూపనప్పటికీ, అలీబాబా ఆ అన్నకు సోదర





విధి నిర్వర్తించ నిశ్చయించాడు. అతను తన అన్న శవాన్ని ఒక గాడిదమీద వేసి దాన్ని కట్టెలతో కప్పాడు. తరవాత మరికొన్ని బంగారం సంచులు తీసి మిగిలిన రెండు గాడిదలమీద వేసి, వాటినికూడా కట్టెలతో కప్పి, తలుపు ఎప్పటిలాగా మూసి ఇంటి దారి పట్టాడు. అతను వెలుతురుండగా అడవిదాటి రాక, అడవి చివర కొంతసేపు ఆగి బాగా చీకటి పడ్డాకనే ఊళ్లో ప్రవేశించాడు. ధనపు సంచులు గల రెండు గాడిదలనూ తన ఆవరణలోకి తోలి, సరుకు దించుకొమని తన భార్యను హెచ్చరించి, మూడో గాడిదను తోలుకుని సరాసరి తన అన్న ఇంటికి వెళ్లి తలవాకిలి తలుపు తట్టాడు.

మోర్జియానా అనే బానిసపిల్ల తలుపు తెరిచింది. ఈమె కాసిం ఇంట్లో వుండే బానిస. చాలా తెలివీ, చాకచక్యమూ గలది, ఎటువంటి చిక్కులోనైనా సమయస్ఫూర్తితో నడుచుకోగలది. ఆమెతో అలీబాబా, "ఓసీ, ఇది పరమ రహస్యం. ఈ గాడిదమీద వున్నది నీ యజమాని శవం. ఆయన జబ్బుచేసి సహజమైన చావు చచ్చినట్టు మనం లోకాన్ని నమ్మించాలి. తరవాత ఆయనకు ఉత్తరక్రియలు జరిపించాలి. ఇదంతా ఎలా చేస్తావో, నీదే భారం. వెళ్లు, నీ యజమానురాలికి అంతా చెప్పు!" అన్నాడు. అతను తన అన్న శవాన్ని ఇంట్లో పెట్టించి, జరగవలసినది యుక్తిగా జరిపించమని మోర్జియానాను మళ్లీ హెచ్చరించి, తన గాడిదను తోలుకుని ఇంటికి వెళ్లిపోయాడు.

మర్నాడు ఉదయమే మోర్జియానా ఒక మందుల దుకాణానికి వెళ్లి, "కాస్త నాభి ఇవ్వండి!" అని అడిగింది. "ఎవరికి?" అని అడిగాడు మందులు చేసేవాడు. "మా యజమాని కాసింగారికి చాలా జబ్బుగా ఉంది. ఆయన గుటక వెయ్యటంలేదు. మాట్లాడటంలేదు!" అన్నది మోర్జియానా





ఆమె ఆ సాయంకాలం మళ్లీ వచ్చి, "కాస్త గరళం వుంటే ఇప్పించండి. ఇదికూడా పని చేస్తుందని ఏమీ నమ్మకంలేదు!" అన్నది ఏడుపుగొంతు పెట్టి.

ఆరోజు అలీబాబా తన భార్యతోనహా రెండు మూడుసార్లు తన అన్నగారి ఇంటికి వెళ్లిరావటమూ, వారి ముఖాలు విచారంగా ఉండటమూ చూసి, కాసింకు చాలా జబ్బు చేసిందని అందరూ సులువుగా నమ్మారు. అందుచేత, ఆ సాయంకాలం కాసిం ఇంట ఏడుపులు సాగగానే అంతా అయిపోయిం దనుకున్నారు. మోర్జియానా అందరితోటీ తన యజమాని చనిపోయినట్టు చెప్పిందికూడా.

మర్నాడు తెల్లవారుతూనే మోర్జియానా ముస్తఫా అనే తోళ్లు కుట్టే ముసలివాడి దుకాణానికి వెళ్లింది. వాడు తూర్పు తెల్ల వారకముందే దుకాణం తెరుస్తాడని ఆమెకు తెలుసు. ఆమె ముసలివాడి చేతులో ఒక బంగారు దీనారం పెట్టి, "బాబా ముస్తఫా, నువు నీ కుట్టుపరికరాలు తీసుకుని నావెంట రావాలి. ముందే చెబుతున్నాను, నేను నిన్ను తీసుకుపోయే చోటు చాలా రహస్యం. అందుచేత మధ్యదారిలో నీ కళ్లకు గంతలు కడతాను!" అన్నది. ముసలివాడు అనుమా నిస్తూ, మోర్జియానా కేసి కొంచెంసేపు చూసి,



"ఓహో, నాచేత కూడనిపని ఏదో చేయించే టట్టున్నావే!" అన్నాడు.

"ప్రమాణపూర్తిగా అలాటిదేమీ లేదు. నావెంట రా, నీకేమీ భయంలేదు," అన్నది మోర్జియానా.

బాబాముస్తఫా ఆమెవెంట బయలు దేరాడు. మధ్యదారిలో ఆమె అన్నప్రకారం ముసలాడి కళ్లకు గంతలు కట్టింది. తరవాత ఆయనను తన యజమాని ఇంటికి తీసుకు పోయి, శవం వున్న గది చేరేసదాకా అతడి కళ్లగంతలు విప్పలేదు.

"బాబాముస్తఫా, ఈ శవాన్ని త్వరగా కుట్టేసినట్టయితే నీకింకొక బంగారు దీనారం





ఇస్తాను," అన్నదామె. ముస్తఫా గబగబా తన పని ముగించి, రెండో దీనారం పుచ్చుకుని, కళ్లకు మళ్లీ గంతలు కట్టించుకుని ఆమె వెంట బయలుదేరాడు. ఎక్కడైతే ముందు గంతలు కట్టిందో అక్కడికి రాగానే ఆమె ముసలాడి గంతలు విప్పేసి, ఇంటికి వెళ్లిపొమ్మన్నది. ముసలాడు తనను వెంబడించకుండా చూసుకుని ఆమె ఇంటికి తిరిగివచ్చింది.

ఇంటికి తిరిగి వస్తూనే మోర్జియానా తన యజమాని శరీరానికి స్నానంచేయించింది. అలీబాబా గుగ్గిలం పొగవేశాడు. తరవాత శవానికి ఆచారంరీత్యా వెయ్యవలిసిన దుస్తులువేశాడు. త్వరలోనే మసీదునుంచి ధర్మకర్తలు వచ్చారు. ఉత్తరక్రియలు జరిపించటానికి ఇమాం వచ్చాడు. ఇమాం మంత్రాలు చదువుతూ ముందునడుస్తూంటే నలుగురు గృహస్థులు శవాన్ని శ్మశానానికి మోసుకువెళ్లారు. మోర్జియానా మాత్రమే గుండెలు బాదుకుని ఏడుస్తూ శవంవెంట వెళ్ళింది. కాసిం భార్య ఇంటివద్ద ఇరుగు పొరుగు ఆడవాళ్ళమధ్య కూచుని భర్తకోసం శోకాలుపెట్టింది.

ఈ విధంగా కాసిం దుర్మరణం కప్పి పుచ్చబడింది. ఆయన చావు రహస్యం తెలిసినది అలీబాబాకూ, మోర్జియానాకూ, కాసిం భార్యకూ మాత్రమే. ఉత్తరక్రియలు జరిగిన మూడునాలుగు రోజుల అనంతరం అలీబాబా తనకున్న కొద్ది సామానుతోసహా తన అన్నగారి ఇంటికి మారాడు. ఇక ముందు అతను అన్నగారి ఇంటనే వుండేటట్టు ఏర్పాటు జరిగింది. తాను దొంగల గుహనుంచి తెచ్చి పాతిపెట్టిన బంగారాన్ని మటుకు అలీబాబా రాత్రివేళ రహస్యంగా కొత్తయింటికి చేరవేశాడు.

కాసిం చాలాకాలంగా నడుపుతూవచ్చిన దుకాణాన్ని ఇప్పుడు అలీబాబా పెద్దకొడుకు చూడసాగాడు. —(ఇంకా వుంది)







# అలీబాబా

(గత సంచిక తరువాయి)

ఈలోపుగా దొంగలు అడవిలో ఉన్న తమ గుహకు తిరిగివచ్చి, కాసిం శవం మాయం కావటం చూసి పొందిన ఆశ్చర్యం ఇంతా అంతా కాదు. తమ బంగారంసంచులు మరికొన్ని పోవటంకూడా వారు వెంటనే తెలుసుకున్నారు.

"మన రహస్యం ఎవరో కనిపెట్టారు. మనం చంపినవాడికి ఎవరో తోడు వుండి వుండాలి. వాడే శవాన్నీ, బంగారాన్నీ తీసుకుపోయాడు. అందులో ఏమీ సందేహం లేదు. ఆ మనిషి ఎవడో తెలుసుకోకపోతే మనకు ప్రమాదం తప్పదు. అందుచేత మీలోకల్లా తెలివిగలవా డొకడు యాత్రికుడిలాగా వేషం వేసుకుని నగరంలోకి వెళ్ళాలి; మనం చంపిన మనిషిని గురించి ప్రజలు ఏం మాట్లాడుకుంటున్నారో ఆలకించి, మొదలు ఆ మనిషి జాడ తీయాలి; ఆ మనిషి పేరేమిటో, వాడెక్కడ వుండేవాడో తెలుసుకోవాలి. ఇది చాలా ప్రాణగండమైన విషయం. ఆరా తీయటానికి వెళ్ళినవాడు ద్రోహం తలపెడితే మిగిలినవారందరికీ ప్రమాదం. అందుచేత ఈ పనిమీద వెళ్ళేవాడు ఏ కారణంచేత పని చేసుకురాకుండా తిరిగి వచ్చినా, వాడికి మరణశిక్ష విధించాలని నా ఉద్దేశం," అన్నాడు దొంగల నాయకుడు.

దొంగలు ఈ విషయం చర్చించకముందే ఒక దొంగ లేచి, "ఈ షరతుకు సమ్మతించి ఈ పనికి నేను పూనుకుంటాను. ఒక వేళ నేను మిగిలిన వాళ్లకోసం చావవలిసి వచ్చినా నాకేమీ అభ్యంతరం లేదు," అన్నాడు ధైర్యంగా.

దొంగలనాయకుడూ, మిగిలిన దొంగలూ వాణ్ణి ఎంతో గొప్పగా మెచ్చుకున్నారు. తరవాత వాడు తనను ఎవరూ గుర్తించరాకుండా వేషం మార్చుకుని, ఆ రాత్రే

ఆర్. సూర్యనారాయణ



బయలుదేరి, తూర్పు తెల్లవారే వేళకు నగరం ప్రవేశించాడు. వాడు వీధులన్నీ కలయదిరుగుతూండగా బాబా ముస్తఫా దుకాణం కనిపించింది. మిగిలిన దుకాణాలేవీ తెరవకముందే తన దుకాణం తెరవటం బాబా ముస్తఫాకు అలవాటు.

బాబాముస్తఫా అప్పుడే పని ప్రారంభించబోతున్నాడు. దొంగ దుకాణంలోకి వెళ్ళి, బాబాముస్తఫాకు సలాంపెట్టి, "ఏం, తాతా? నీకు పగలే కళ్ళు సరిగా కనబడవేమోగదా, ఇంకా తెల్లవారకముందే పని ప్రారంభించావేమిటి? ఈ వెలుతురులో నీకు చూపు అనుతుందా?" అని అడిగాడు.

"నాసంగతి నువ్వెరగవు. ముసలివాణ్ణయినా నా చూపు కొంచెంకూడా చెడలేదు. ఎందుకూ? ఇంత వెలుతురుకూడా లేని చోట నేను శవాన్ని కుట్టాను!" అన్నాడు బాబాముస్తఫా.

"శవాన్నా?" అన్నాడు దొంగ, ఆశ్చర్యపోతున్నట్టు నటిస్తూ.

"అవునవును, నేనా కథంతా నీకు చెప్పేస్తాననుకుంటున్నావు గామాలు. అదేం కుదరదు!" అన్నాడు బాబాముస్తఫా.

తనకు కావలిసిన రహస్యం ఈ ముసలాడు చెప్పగలడని దొంగకు నమ్మకం కుదిరింది. వాడు ఒక బంగారు దీనారం తీసి బాబాముస్తఫా చేతిలో పెడుతూ, "నీ రహస్యాలు నాకెందుకు, తాతా? నీకు పిచ్చిగాని నాకు ఏ రహస్యం చెప్పినా నీకు కలిగే నష్టమేముందీ? నే నడిగేదల్లా ఏమిటంటే, నువు ఈ శవాన్ని ఏ ఇంట్లో కుట్టావో ఆ యిల్లు నాకు చూపించు, చాలు!" అన్నాడు.

"ఒకవేళ నేను నీకా ఇల్లు చూపింతామనుకున్నా అది నావల్ల అయే పనికాదే. నన్ను ఒకచోటికి తీసుకుపోయి, అక్కడ నా కళ్ళకు గంతలు కట్టి తీసుకుపోయారు. మళ్ళా గంతలు కట్టి నన్నక్కడికే తెచ్చి విడిచిపెట్టారు. అందుచేత నీకా యిల్లు





చూపించటం నావల్ల అయే పనికాదు," అన్నాడు ముసలాడు.

"ఒకవేళ అదే చోటికి తీసుకుపోయి కళ్ళకు గంతలు కట్టితే, నన్నాయింటికి తీసుకుపోగలవేమో చూడు. నీ రుణం ఉంచుకోనులే. ఇంద, ఇంకొక దీనారం తీసుకో!" అంటూ దొంగ బాబాముస్తఫా చేతిలో మరొక బంగారు నాణెం పెట్టాడు.

ముసలాడు తన చేతిలో ఉన్న రెండు దీనారాలకేసి చాలాసేపు చూశాడు. అవి ఆ ముసలాణ్ణి చాలా ఆకర్షించాయి. వాటిని జేబులో వేసుకుంటూ, "ప్రయత్నిస్తాను; కాని ఆ ధారి నాకు జ్ఞాపకం ఉంటుందని మాట ఇవ్వలేను," అన్నాడు.

బాబా ముస్తఫా దొంగను వెంటబెట్టుకుని ఒక చోటికి వచ్చి, "ఇక్కడే నా కళ్లకు గంతలు కట్టారు. తరవాత నన్ను ఇటుగా తీసుకుపోయారు," అన్నాడు.

దొంగ ముసలాడి కళ్లకు తన చేతి రుమాలు గంత కట్టాడు. తన జ్ఞాపకాన్ని అనుసరించి బాబా ముస్తఫా తనవెంట ఉన్న దొంగను సరిగా కాసిం ఇంటికి చేర్చాడు. దొంగ ఇంటి వాకిలి తలుపుపైన సుద్దముక్కతో ఒక గుర్తు పెట్టి, బాబా ముస్తఫా కళ్లకు కట్టిన గంత విప్పాడు.



ఆ ఇల్లెవరిదో తెలుసునా అని దొంగ అడగగా ముసలాడు తానా పేటలో ఉండేవాణ్ణి కాననీ, తనకు తెలియదనీ చెప్పాడు. ముసలాడి నుంచి ఇంక తెలుసుకోవలసినది లేదని గ్రహించి దొంగ ముసలాడివద్ద సెలవు తీసుకుని నేరుగా అడవిలోని తన అనుచరుల వద్దకు వెళ్లిపోయాడు.

దొంగా, బాబా ముస్తఫా వెళ్లిపోయిన కొద్దిసేపటికి మోర్జియానా ఏదో పనిమీద బయటికి వెళ్ళి, తిరిగివస్తూ వాకిలిమీద ఉన్న గుర్తు చూచింది.

"ఈ గుర్తు ఏమిటై ఉంటుంది. నా యజమానికి ఎవరో అపకారం తలపెట్టి

నట్టుందే! ఎటుపోయి ఎటుపచ్చినా కీడెంచి మేలెంచటం మంచిది!" అనుకుని మోర్జి యానా లోపలికి వెళ్లి ఒక సుద్దముక్క తెచ్చి తమ ఇంటికి అటూ ఇటూ ఉన్న వాకిళ్ళకుకూడా అలాటి గుర్తులే పెట్టింది. ఈ విషయం ఆమె అలీబాబాకు చెప్పలేదు.

ఈ లోపుగా దొంగ తనవారిని చేరుకుని తాను సాధించిన విజయాన్ని గురించి చెప్పాడు. అందరూ వాణ్ణి అభినందించారు. తరవాత దొంగల నాయకుడు తన అను చరులతో ఇలా అన్నాడు: "సోదరులారా, మనం జాగు చేయరాదు. ఆయుధాలు తీసు కుని, మారువేషాలు వేసుకుని నగరంలోకి వెళ్ళాలి. అందరమూ కలిసి వెళితే అంతా అనుమానిస్తారు. అందుచేత ఇద్దరిద్దరుగా వెళ్ళి, అందరమూ నగరంలోని పెద్ద చౌకులో కలుద్దాం. ఈ లోపుగా నేనూ, ఇల్లు చూసి వచ్చిన మన సోదరుడూ కలిసి గుర్తుపెట్టిన ఇంటికి వెళ్లి పరిస్థితి చూసివస్తాము. ఆ తరవాత అందరమూ కలిసి కర్తవ్యం నిర్ణ యించవచ్చు."

దీనికి అందరూ సమ్మతించారు. దొంగలు ఇద్దరిద్దరుగా చీలి, ఒక జత వెళ్ళిన తర వాత మరొక జత చొప్పున, ఎవరికీ ఏ అను మానమూ కలగకుండా, నగరాన్ని చేరు కున్నారు. దొంగల నాయకుడూ, ఇల్లు గుర్తు





పెట్టిన దొంగా ఆఖరుకు బయలుదేరి ఆలీ బాబా ఉంటున్న వీధికి వచ్చారు. మోర్జి యానా గుర్తుపెట్టిన ఇళ్ళలో ఒక చివర వున్న ఇంటిని చూడగానే దొంగ, "ఇదే నేను గుర్తుపెట్టిన ఇల్లు!" అన్నాడు.

"దీనిపక్క ఇల్లుకూడా ఇలాగే గుర్తు పెట్టి ఉన్నదే!" అన్నాడు దొంగల నాయ కుడు. ఆ రెండు ఇళ్ళలోనూ అసలు ఇల్లేదో తెలియక వారు తికమక పడుతూండగా వారికి ఇంకా చాలా ఇళ్ళు అదేవిధంగా గుర్తుపెట్టి ఉండటం తెలియవచ్చింది. ఇల్లు గుర్తుపెట్టిన దొంగ కంగారుపడిపోయాడు. తాను ఒక్క ఇంటికే గుర్తుపెట్టానని ప్రమాణంచేసి చెప్పాడు. మిగిలిన గుర్తు లింకెవరో పెట్టిఉండాలన్నాడు.

దొంగల ప్రయత్నం విఫలమయింది. పెద్దచౌకులో మిగిలినవాళ్లను కలుసుకుని, ప్రస్తుతానికి చేసేదేమీ లేదని చెప్పి దొంగల నాయకుడు వారితోసహా అడవిలోకి వెళ్ళి పోయాడు. మిగిలినవారంతా ఎలా వచ్చారో అలాగే తిరిగి వెళ్ళారు. ఇల్లు కనుక్కోవ టానికి వెళ్ళి విఫలుడైన దొంగ మరణదండ నను అహ్వానించాడు. అతనిని శిరచ్ఛేదం చేశారు. వెంటనే ఆ పని పూర్తిచేయటానికి మరొక సాహసి ముందుకు వచ్చాడు. తరవాత వాడు నగరంలోకి వెళ్ళి బాబా ముస్తఫాకు







బాగా లంచంపెట్టి అలీబాబా ఉంటున్న ఇల్లుగుర్తు తెలుసుకున్నాడు. అయితే వాడా ఇంటిమీద అందరికీ సులువుగా కనబడని చోట ఒక ఎర్రగుర్తు పెట్టి తనవారివద్దకు తిరిగి వెళ్ళాడు.

అయితే మోర్జియానా కళ్ళు చాలా చురుకైనవి. ఆమె ఈ ఎర్రగుర్తునుకూడా పసికట్టి, ఎందుకైనా మంచిదని అలాటి గుర్తులు మిగిలిన ఇళ్లకుకూడా పెట్టేసింది.

దొంగలు ఈసారి తమ ఎత్తు పారుతుందని ఆశపడ్డారు. వెనకటిలాగే ఎవరికీ ఎటువంటి అనుమానమూ కలగకుండా నగరం ప్రవేశించారు. ఎర్రగుర్తు పెట్టిన దొంగను వెంట పెట్టుకుని దొంగల నాయకుడు అలీబాబా ఉంటున్న వీధికి వెళ్ళాడు. చాలా ఇళ్ళకు ఎర్రగుర్తులుండటం చూసేసరికి వారి ఆశ నిరాశ అయిపోయింది. చేసేదిలేక అందరూ మళ్ళీ అడవికి తిరిగి వెళ్ళారు. ప్రయత్నం విఫలం కావటంవల్ల రెండవ దొంగకుకూడా శిరచ్ఛేదం జరిగింది.

మెరికలవంటి అనుచరులు ఇద్దరు పోయేసరికి, ఇక ఈ పద్ధతివల్ల ప్రయోజనం లేదని దొంగల నాయకుడు గుర్తించాడు. ఈసారి తానే స్వయంగా బయలుదేరి బాబా ముస్తఫా వద్దకు వెళ్ళాడు. అదివరకులాగే బాబా ముస్తఫా సహాయపడ్డాడు. ఆ ముసలివాడి సహాయంతో దొంగల నాయకుడు అలీబాబా ఉంటున్న ఇంటిముందు నిలబడ్డాడు. కాని అతను ఆ ఇంటికి ఎలాటి గుర్తులూ పెట్టక, ఆ వీధివెంబడి అటూ ఇటూ చాలాసార్లు నడిచి ఇల్లు పూర్తిగా పరిచయం చేసుకుని అడవికి తిరిగి వెళ్ళిపోయాడు.

"సోదరులారా, ఈసారి నేను ఆ ఇంటిని బాగా మననం చేసుకు వచ్చాను. ఇక ఎటువంటి పొరబాటూ జరగదు. మనం పగ తీర్చుకోవచ్చు. అందుకుగాను నేనొక ఆలోచన చేశాను, వినండి. మీలో ఎవరికైనా అంతకంటె మంచి ఆలోచన తట్టితే







చెప్పండి, వింటాను!" అంటూ దొంగల నాయకుడు తాను చేసిన ఆలోచనను తన అనుచరులతో చెప్పేశాడు. వారు ఆ ఆలోచనను పూర్తిగా బలపరచటమేగాక అతణ్ణి ఎంతగానో అభినందించారు.

తరవాత దొంగలు చుట్టుపక్కల గల గ్రామాలకు వెళ్లి పందొమ్మిది కంచరగాడిదలనూ, ముప్ఫైఎనిమిది పెద్ద తోలుతిత్తులనూ కొన్నారు. ఆ తిత్తులలో ఒకదాని నిండా నూనె నింపారు. మిగిలిన ముప్ఫైఏడు తిత్తులలోనూ ముప్ఫైఏడుగురు దొంగలు ఆయుధాలతో సహా దూరి కూచున్నారు. దొంగల నాయకుడు ఆ తిత్తుల పైభాగాన నూనె పూశాడు.

తరవాత దొంగల నాయకుడు నూనె వ్యాపారి వేషం ధరించి, ముప్ఫై ఎనిమిది తిత్తులనూ పందొమ్మిది కంచరగాడిదల పైనా వేసి, వాటిని తోలుకుంటూ బయలుదేరి చీకటిపడే వేళకు నగరం చేరుకున్నాడు. అతను ఆ కంచరగాడిదలను తోలుకుంటూ అలీబాబా ఉండే వీధి చేరేసరికి చాలా పొద్దుపోయింది. అలీబాబా అప్పుడే భోజనం ముగించి వాకిలివద్ద చల్లగాలికి నిలబడ్డాడు.

దొంగల నాయకుడు అలీబాబాను సమీపించి, "అయ్యా, నేను నూనెవర్తకుణ్ణి. చాలా దూరంనుంచి వస్తున్నాను. రేపు సంతలో ఈ నూనె అమ్మేస్తాను. చాలా పొద్దు పోయింది. ఈ రాత్రికి ఎక్కడ బస చేయాలో తెలియదు. మీకేమీ శ్రమ లేని పక్షంలో నన్ను ఈపూట మీ ఇంట తల దాచుకోనివ్వండి. మీమేలు ఎన్నటికీ మరవను," అన్నాడు.

అలీబాబా ఈ దొంగల నాయకుణ్ణి అదివరకు అడవిలో చూసిఉన్నాడు, అతని గొంతు విని ఉన్నాడు కూడా; అయినా ఆయన ఆ మనిషిని గుర్తుపట్టలేకపోయాడు. "దానికేం భాగ్యం? దయచెయ్యండి!" అంటూ అలీబాబా వాకిలి తెరిచి దొంగల

నాయకుణ్ణీ, అతని కంచరగాడిదలనూ లోపలికి రానిచ్చాడు.

అబ్దుల్లా అనే బానిసవాడు వచ్చి కంచరగాడిదలమీద ఉన్న తిత్తులను దింపి, కంచరగాడిదలను పశువుల కొట్టంలోకి తీసుకుపోయి వాటికి దాణా వేశాడు. మోర్జియానా అతిథికోసం మళ్ళీ వంట చేసింది. దొంగల నాయకుడు భోజనం చేసినాక అలీబాబా మోర్జియానాతో, "మన అతిథికి ఏ లోపం రాకుండా జాగ్రత్తగా చూసుకో! నేను రేపు తెల్లవారకముందే బయలుదేరి స్నానశాలకు వెళతాను. నా దుస్తులూ అవీ తీసి అబ్దుల్లా చేతికి ఇయ్యి, నేను స్నానం చేసి తిరిగి వచ్చేసరికి నా భోజనానికి శోర్వా తయారుచేసి సిద్ధంగా ఉంచు," అని హెచ్చరించి వెళ్లి పడుకున్నాడు.

ఈలోపుగా దొంగల నాయకుడు దొడ్డిలోకి వెళ్లి ఒక్కొక్క తోలుతిత్తిమీద ఉన్న మూతా ఎత్తి, "నేను కిటికీలోనుంచి గులకరాళ్లు విసరగానే బయటికి రావాలి. మరవవద్దు!" అని తిత్తిలో ఉండే దొంగలకు పేరుపేరునా చెప్పాడు.

అతను ఇంట్లోకి తిరిగిరాగానే మోర్జియానా అతను పడుకునే చోటు చూపి, తన యజమాని దుస్తులు తీసిపెట్టి, శోర్వా తయారు చెయ్యటానికిగాను పొయి రాజెయ్యమని అబ్దుల్లాతో చెప్పింది. పొయి రాజగానే ఆమె శోర్వా తయారుచేయ నారంభించింది. కాని మధ్యలో చమురు అయిపోయి దీపం కాస్తా ఆరిపోయింది.

"వంట పూర్తికాలేదు. మధ్యలో దీపం ఆరిపోయింది. ఇంటో ఒక్క చుక్కకూడా నూనె ఉన్నట్టు లేదు. ఏంచెయ్యాలో నాకు తోచకుండా ఉన్నది," అన్నది మోర్జియానా.

"ఆ వర్తకుడి తిత్తులనిండా నూనె ఉన్నది. కొంచెం పట్టుకురా. ఇంతలో కొంప మునిగిపోదులే!" అన్నాడు అబ్దుల్లా.

—(ఇంకా వుంది)







# అలీబాబా

(గత సంచిక తరువాయి)

మోర్జియానా సంకోచించకుండా నూనె దుత్త తీసుకుని దొడ్లోకి వెళ్లింది. ఆమె మొదటి తిత్తిని సమీపించేసరికి లోపలి నుంచి దొంగ, "వేళ అయిందా?" అని చిన్నగొంతుతో అడిగాడు. మోర్జియానా మొదట నిర్ఘాంతపోయింది, కాని అంతలోనే గుండె నిబ్బరం తెచ్చుకుని, రహస్యంగా, "ఇంకా లేదు. కొంచెం ఆగు!" అన్నది. వరసగా ముప్పైఏడు తిత్తులూ ఆమెను ఇలాగే పలకరించాయి; ఆమె వాటికి ఈ సమాధానమే చెప్పింది. ఆఖరు తిత్తి మాత్రమే ఏమీ అనలేదు. ఆమె అందులో నుంచి నూనె పోసుకుని ఇంట్లోకి వచ్చేసింది.

తన యజమాని అలీబాబా ముప్పై ఎనిమిదిమంది దొంగలకు ఆశ్రయ మిచ్చి నట్టు మోర్జియానా తెలుసుకున్నది. నూనె వర్తకుడి నంటూ వచ్చినవాడు మిగిలిన వారికి నాయకుడై ఉండాలి. ఆమె దీపంలో చమురు పోసి, పెద్ద బాండా తీసుకుని మళ్లీ నూనెతిత్తి వద్దకు వెళ్లింది. బాండా నిండా నూనె నింపుకుని దాన్ని, పెద్ద మంటమీద మరగకాచింది. ఆ మరిగే నూనె తీసుకు పోయి ఒక్కొక్క తిత్తిలోనూ పోసింది. ఏతిత్తిలో దొంగ ఆ తిత్తిలో వేడినూనెకు మగ్గి, ఊపిరాడక చచ్చాడు. ఈవిధంగా ముప్పైఏడుగురు దొంగలనూ నిశ్శబ్దంగా హతమార్చి, సాహసురాలైన మోర్జియానా వంటఇంటికి తిరిగివచ్చి, నూనె కాచటం కోసం పెద్దది చేసిన మంటను తగ్గించి, శోర్వా వండటానికి చాలినంతమాత్రమే ఉంచి, దీపం ఆర్పేసి, ఏం జరుగుతుందో చూడ టానికి కిటికీ వద్ద నిలబడింది.

ఆమె దీపం ఆర్పేసిన కొద్దిసేపటికి దొంగల నాయకుడు, ఎక్కడా ఒక దీపం గాని అలికిడిగాని లేకపోవటం గమనించి,

ఆర్. సూర్యనారాయణ



పక్క మీదినుంచి లేచి కిటికీలోనుంచి గులక రాళ్ళు బయటికి రువ్వాడు. వాటిలో కొన్ని తోలుతిత్తులకు తగిలినప్పటికీ ఒక్క దొంగా బయటికి రాలేదు. దొంగలనాయకుడు ఆందోళన చెంది, అడుగులో అడుగు వేసు కుంటూ బయటికి వెళ్ళి, మొదటితిత్తి మూత తెరిచి, "సిద్ధంగా వున్నావా?" అని అడి గాడు. తిత్తిలోనుంచి గుప్పున నూనె వాసన కొట్టింది తప్ప ఏ జవాబూ రాలేదు. తన అనుచరులందరూ హతమైనారనీ, అలీ బాబాను చంపేందుకు, తాను వేసిన ఎత్తు కాస్తా బయటపడిపోయిందనీ తెలుసుకుని దొంగలనాయకుడు ప్రహరీగోడ దూకి పారి పోయాడు. ఇదంతా చూస్తూవుండిన మోర్జి యానా, గదికివెళ్ళి పడుకుని, తన యజ మానిని గొప్ప ప్రమాదంనుంచి కాపాడానన్న ఆనందంతో సుఖంగా నిద్రపోయింది.

అలీబాబాకు ఈ జరిగిన సంగతు లేవీ తెలియవు. ఆయన తెల్లవారకముందే లేచి, తన బానిసను వెంటబెట్టుకుని స్నానశాలకు వెళ్ళిపోయాడు. ఆయన తిరిగివచ్చి కంచర గాడిదలు ఇంకా తన దొడ్డిలోనే వుండటం చూసి మోర్జియానాతో "ఆ నూనెవర్తకు డింకా వెళ్ళిపోలేదా?" అన్నాడు.

"యజమానీ, మీరు పూర్తిగా పెరటి దోవనే వున్నారు. నావెంట రండి, అసలు






చూడవలసింది నేను చూపిస్తాను," అంటూ మోర్జియానా ఆయనను తోలుతిత్తులున్న చోటికి తీసుకుపోయి మొదటి తిత్తిలోకి చూడమన్నది. అలీబాబా ఆ తోలుతిత్తిలో మనిషి వుండటం చూసి గతుక్కుమన్నాడు.

"భయపడకండి! ఆ మనిషి ఎవరికీ ఏ హానీ చెయ్యలేడు. వాడు చచ్చాడు," అన్నది మోర్జియానా.

"ఇదంతా ఏమిటి, మోర్జియానా?" అన్నాడు అలీబాబా విచారంగా.

"మీరు గట్టిగా మాట్లాడకండి. ఇది పరమ రహస్యం. ఇరుగుపొరుగువాళ్లకు తెలియ గూడదు. ఈ తిత్తులన్నీ వరసగా చూడండి," అన్నది మోర్జియానా. అన్ని తిత్తులూ చూశాక అలీబాబా ఆశ్చర్యానికి అంతు లేకుండాపోయింది.

"ఆ నూనెవర్తకు డేమయాడు?" అన్నాడు అలీబాబా.

"నేనెంత వర్తకుణ్ణో వాడూ అంతే వర్తకుడు. మీరు ముందు ఓర్పు తీసుకోండి. నేను జరిగినదంతా చెబుతాను," అన్నది మోర్జియానా. తరవాత ఆమె తాను తల వాకిలి తలుపుమీద తెల్లగుర్తు చూడటం లగాయతు దొంగల నాయకుడు పారిపోవటం దాకా జరిగిన విషయాలన్నీ వివరంగా తన యజమానికి చెప్పింది.





అంతా విని అలీబాబా, "మోర్జియానా, నువు అడ్డుపడకపోతే ఈ దొంగలు నన్ను నిజంగా నాశనం చేసి ఉందురు. ప్రాణ దానం చేసిన నీ ఋణం కొంత తీర్చుకునే టందుకు నిన్ను బానిసత్వంనుంచి విముక్తి చేస్తున్నాను. మిగిలిన ఋణం తీర్చుకునే ఏర్పాట్లు తరవాత చూస్తాను!" అన్నాడు.

అలీబాబా తోట చాలా నిడివి అయినది. దాని చివర చాలా ఎత్తయిన పెద్ద చెట్లు న్నాయి. ఈ చెట్ల మధ్యగా అలీబాబా, అబ్దుల్లా కలిసి ఒక పొడుగైన కందకం తవ్వి, అందులో దొంగలతో సహా తోలుతిత్తు లన్నిటినీ పూడ్చేశారు. తరవాత అలీబాబా కంచరగాడిదలను ఒక్కొక్కటిగా సంతకు పంపించి అమ్మిం చేశాడు.

అలీబాబా ఇంటినుంచి పారిపోయిన దొంగల నాయకుడు గుండెలు మండిపోతూ అడవిలోకి తిరిగి వెళ్ళాడు. తన అనుచరు లంతా పోయిన కారణంచేత దొంగల గుహ బావురుమంటున్నది. అక్కడ కొద్దిసేపు ఉండేసరికల్లా భయంవేసి అతను నగరానికి తిరిగి వచ్చాడు. తిరిగివస్తూ అలీబాబాను హతమార్చి తన అనుచరుల తరఫున పగ తీర్చుకుంటానని ప్రతిజ్ఞ తీసుకున్నాడు.

ఇందుకుగాను దొంగల నాయకుడు బట్టల వ్యాపారి వేషం ధరించి కొజియా హుసేన్ అని పేరు పెట్టుకున్నాడు. అతను నగరంలో ఒక ఇల్లు అద్దెకు తీసుకుని, ఎవరూ చూడకుండా తన గుహనుంచి పట్టుతానులు తెచ్చి అందులో పేర్చాడు. అలీబాబా పెద్ద కొడుకు ప్రస్తుతం చూస్తున్న కాసిం దుకా ణాని కెదురుగా దొంగలనాయకు డొక గిడ్డంగి అద్దెకు తీసుకున్నాడు.

కొత్తగా వచ్చిన వర్తకుడు పాత వర్త కులను మర్యాదగా చూడటం ఆచారం. ఈ ఆచారాన్ని దొంగల నాయకుడు పాటించాడు. అతను ముందుగానే అలీబాబా కొడుకుతో స్నేహం కలిపాడు. రెండుమూడు రోజుల





అనంతరం అతను తన ఎదురుగా వున్న దుకాణంలో అలీబాబాను చూసి వెంటనే గుర్తు పట్టాడు. అలీబాబా తన తండ్రి అని కొత్తస్నేహితుడు చెప్పినమీదట దొంగల నాయకుడు ఆ స్నేహితుడితో మరింత స్నేహంగా ఉంటూ, ప్రేమగా సంభాషించటమూ, చిన్నచిన్న బహుమానాలివ్వటమూ, చీటికీ మాటికీ భోజనానికి పిలవటమూ మొదలైన పనులు చేయసాగాడు.

ఇదంతా చూసి అలీబాబా కొడుకు తన తండ్రితో, "ఈ కోజియా హుసేన్ నాకు అనేక రకాల మర్యాదలు చూపుతున్నాడు. మనం అతన్ని మన ఇంటికి ఆహ్వానిస్తే బాగుంటుంది," అన్నాడు.

"నాయనా, రేపు శుక్రవారం, దుకాణాలు మూసే రోజు. అందుచేత అతన్ని వెంట బెట్టుకురా. భోజనం తయారుచేయమని నేను మోర్జియానాతో చెబుతాను," అన్నాడు అలీబాబా సంతోషంగా.

అలీబాబా కొడుకు ఆ ప్రకారమే కోజియా హుసేన్‌ను వెంటబెట్టుకుని అలీబాబా ఇంటి దాకా తీసుకువచ్చి, "ఇదే మా నాన్న వుండే ఇల్లు. మన స్నేహం మాట విని ఆయన నిన్ను తప్పక భోజనానికి తీసుకురమ్మన్నాడు," అన్నాడు.



దొంగల నాయకుడికి కావలిసింది ఏదో మిషమీద అలీబాబా ఇంట్లో ప్రవేశించి అలీబాబాను చంపటమే. అయినప్పటికీ అతను వెనక్కు తీసి, రానంటె రానని భీష్మించాడు. కాని ఇంతలోనే నౌకరు వచ్చి తలుపు తీశాడు. అలీబాబా కొడుకు అతన్ని బలవంతంగా లోపలికి తీసుకుపోయాడు.

అలీబాబా కోజియా హుసేన్ తన కొడుకు పట్ల చూపిన స్నేహభావాన్ని కొనియాడాడు. "మావాడు ఇంకా చిన్నవాడు. వాడికి ప్రపంచజ్ఞానం తక్కువ. మీవంటివాళ్ళ నుంచి నేర్చుకోవలిసింది చాలా వుంది," అన్నాడాయన దొంగలనాయకుడితో.





"మీవాడికి ప్రపంచజ్ఞానం తక్కువ కావచ్చుగాని బుద్ధిబలంలో వయసు మళ్లిన వారికి ఏమీ తీసిపోదులెండి!" అన్నాడు కోజియా హుసేన్.

వారా విధంగా కాస్సేపు మాట్లాడుకున్నాక కోజియా హుసేన్ లేచి, వెళ్లివస్తానన్నాడు. అలీబాబా ఆదుర్దాగా, "అదేమిట? మీరీ పూట నాతో కూచుని భోజనం చెయ్యాలి. మీరు మాకు ఆప్తులు. మాది పేదభోజనమే అయినా అదే మీకక్కడా పెట్టకుండా పోనివ్వను," అన్నాడు.

"నేను ఉప్పువేసిన పదార్థాలు ముట్టను. అందుచేత నన్ను నిర్బంధించక వెళ్లనివ్వండి!" అన్నాడు కోజియా హుసేన్.

"నాకుకూడా ఉప్పు సయించదు. మీకు కావలిసినట్టుగానే భోజనం పెట్టిస్తాను. ఉండండి!" అంటూ అలీబాబా వెళ్లి మోర్జియానాతో, "మోర్జియానా, మన కొక అతిథి వచ్చాడు. అతను ఉప్పు తినడు. అందుచేత అతనికోసం వెంటనే చప్పిడి భోజనం తయారుచెయ్యి!" అన్నాడు.

మోర్జియానా ముఖం చిట్లించి, "ఎవరీ వింతమనిషి? ఈ చప్పిడివంట పూర్తి అయేలోగా మీ భోజనం చప్పగా చల్లారి పోతుంది," అన్నది. అందుకు అలీబాబా నవ్వుతూ, "కోప్పడకు, మోర్జియానా, అతను



మనకు కావలిసిన వాడు. నేను చెప్పినట్టు చెయ్యి," అన్నాడు

మోర్జియానా చెప్పిదివంట తయారు చేసి వడ్డించే సమయంలో అబ్దుల్లా వెంట తానుకూడా వడ్డనకు వచ్చింది. కొజియా హుసేన్‌ను చూడగానే ఆమె దొంగలనాయకుణ్ణి పోల్చేసింది. అంతేకాదు, అతని అంగరఖా అడుగునవున్న బాకు పిడికూడా ఆమెకంట పడింది.

వడ్డన పూర్తికాగానే ఆమె నృత్యంచేసే దుస్తులు ధరించి, తన బొడ్డులోకూడా ఒక బాకు పెట్టుకుని, కంజరీ ఒకటి తీసుకు రమ్మని అబ్దుల్లాకు చెప్పింది. వారు వచ్చే సరికి అలీబాబా, ఆయన కొడుకూ దొంగల నాయకుడూ ఇంకా భోజనం ముగించలేదు.

"రా, మోర్జియానా! నీ నృత్యం అతిథికి చూపించు!" అన్నాడు అలీబాబా.

ఆమె చాలాసేపు బాకు పట్టుకుని నృత్యం చేసింది. నృత్యం చేసేటప్పుడు చాలాసార్లు తనను తాను పొడుచుకునేలాగా అభినయించింది. నృత్యం పూర్తి అయాక అబ్దుల్లాను వెంట పెట్టుకుని బహుమానం కోసం వచ్చింది. అలీబాబా కంజరీలో ఒక దీనారం వేశాడు. అలీబాబా కొడుకు మరొక దీనారం వేశాడు. అబ్దుల్లా కంజరీపట్టుకుని దొంగలనాయకుడి దగ్గిరికి వచ్చాడు. దొంగల



నాయకుడు డబ్బుసంచీకోసం జేబులో చెయ్యిపెట్టాడు. సరిగా ఆసమయంలో మోర్జియానా దొంగలనాయకుణ్ణి బాకుతో గుండెలో పొడిచేసింది.

అలీబాబా చివాలున లేచి ఆక్రోశిస్తూ, "ఎంతపని చేశావు మోర్జియానా!" అన్నాడు.

"మీరు తొందరపడకండి. వీడు బట్టల వర్తకుడే కాదు, నూనెవర్తకుడుకూడా వీడే, దొంగలనాయకుడూ వీడే! వీడి బొడ్డులో బాకు చూడండి! మిమ్మల్ని కడతేర్చటానికే తెచ్చాడు. వీడు మీ ఉప్పు తిననని ఎప్పుడన్నాడో అప్పుడే నాకు అనుమానం తగిలింది. అందుకే వడ్డన నెపంమీద వచ్చి వీణ్ణి చూసి, వెంటనే గుర్తించాను! ఇవాళ మీరు లేచినవేళ మంచిది!" అన్నది మోర్జియానా.

"మోర్జియానా, నీ ఋణం నిజంగా తీరదు. నీకు అదివరకే స్వేచ్ఛ ఇచ్చాను. ఇప్పుడు నిన్ను నా కోడలిని చేసుకుంటాను!" అన్నాడు అలీబాబా.

అలీబాబా కొడుకు మోర్జియానాను పెళ్లాడటానికి సంతోషంగా ఒప్పుకున్నాడు.

మిగిలిన దొంగలను పాతేసినట్టే దొంగల నాయకుణ్ణికూడా రహస్యంగా పాతేశారు. ఇప్పుడు అడవిలో వున్న గుహ రహస్యం తెలిసినవాడు అలీబాబా ఒక్కడే. కాని మరి ఇద్దరు దొంగలు బతికిఉన్నారన్న అనుమానంతో ఒక ఏడాదిపాటు అలీబాబా ఆ గుహ ప్రాంతాలకు పోలేదు.

ఒక ఏడాదిపాటు తనకెవరూ హానిచేయ యత్నించక పోవటం చూసి ఆయన ఒకనాడు గుహకు వెళ్ళాడు. అక్కడ ఏడాదిగా ఎవరూ అడుగు పెట్టిన జాడలేదు.

కాలక్రమాన అలీబాబా ఈ గుహ రహస్యాన్ని తన కొడుక్కు చెప్పాడు. తరవాత చాలా తరాలవారు ఆ గుహ తాలూకు రహస్యం తమ తండ్రులవద్దనుండి తెలుసుకుని ఆ గుహనుంచి తెచ్చిన సంపదతో సుఖంగా బతికారు. —(ఐపోయింది)



